ఈ పుస్తకం కె.కె. బిర్లా ఫౌండేషన్ వారి
ఆర్థిక సహాయంతో తయారుచేయబడినది.

ISBN 81-237-1924-8

---

ప్రథమ ముద్రణ 1996 *(శక 1918)*

KHEMI *(Telugu)*
రూ. **3.50**
డైరెక్టర్, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, ఎ-5, గ్రీన్‌పార్క్,
న్యూఢిల్లీ-110016 ద్వారా ప్రచురింపబడినది.

---

నవశిక్షిత సాహిత్యమాల

# రంగి

రామనారాయణ పాఠక్ 'ద్విరేఫ్'

రూపాంతరం

వర్షా దాస్

చిత్రాలు

స్వపన్ సర్కార్

అనువాదం

బి. నాగలక్ష్మి



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

రాములు ఐదో అగ్గిపుల్ల వెలిగించాడు. అయినా అతని బీడీ అంటుకోనేలేదు. "అరే! ఎన్ని పుల్లలు అలా తగలేస్తావ్? పెట్టె కాస్తా రెండు రోజులకే అయిపోతుంది!" అంది అతని పెళ్ళాం రంగి అతన్ని ఆపుతూ.

"గాలి ఎలా ఉందో చూడు. పుల్ల వెలగడమే లేదు." అంటూ రాములు కొత్త పుల్ల బయటకు తీసాడు.

"ఉండు. నా చీరకొంగు గాలికి అడ్డం పెడతాను" అంటూ రంగి తన పై కొంగును పెద్దగా తీసింది. రాములు వైపు గాలి రాకుండా అడ్డు పెట్టింది. రాములు అగ్గిపుల్ల గీసి బీడీ అంటించాడు. తన పెళ్ళాం రంగి మొఖంమీద పొగ వదిలాడు.

ఆ రోజు రాములికి అక్కడ ఒక సేఠ్‌గారింట్లో విందు ఉంది. రాములు, రంగి ఆ విందు సంబరంలో పెరటి మెట్ల మీద కూర్చుని ఉన్నారు. రాములు బీడీ దమ్ము లాగి వదిలాడు.

"రంగీ!... మీ అమ్మ ఏదడిగినా ఇచ్చేసి ఉండేవాడినే. నిన్ను మాత్రం పెళ్ళి చేసుకోకుండా వదిలేవాడిని కాదు..." అన్నాడు.

"కానీ, మా అమ్మ నీ దగ్గర దమ్మిడీ అయినా పుచ్చుకోందే... ఇంకా నేనే నీ యింటికి పట్టుకువచ్చా."అంది రంగి.

"మీ అమ్మ చాలా మంచిదే. కానీ నీవే ఎంత ఛండాలంగా తయారయావో నీకు తెలియదు!" అన్నాడు రాములు.

"ఇదిగో... నేను నీకు ఏం తక్కువ చేశాను?"

"నువ్వు పెళ్ళికి ముందు ఎన్ని వేషాలు వేశావు? తాగనన్నావు,

తిట్టనన్నావు, కొట్టనన్నావు. అప్పుడు కదా పెళ్ళి చేసుకున్నాను! మళ్ళీ ఎప్పుడైనా అలా చేశావో నిన్ను వదిలేసి పోతా... ఏం? అది జరిగేది కాదంటావా?"

"ఎందుకు జరగదు? తాగి గోల చెయ్యడం, నోటికి వచ్చినట్లు మాట్లాడటం, అదంతా నేను సహించాలంటావా? ఈ తన్నులు తినడం నావల్ల కాదు..." అంది రంగి.

రంగి మాటలు విన్న రాములుకు ధైర్యం వచ్చింది.

"సరే... అలాగే... నేను తాగడానికి ఎక్కడ పోతానో అని అంత ఆవేశంగా మాట్లాడుతున్నావు! నువ్వు చిన్నప్పుడు మీ అమ్మతో కలిసి ఊడవడానికి వచ్చేదానివి గుర్తుందా. అప్పటి నుంచే నాకు నువ్వంటే ఎంతో ఇష్టం." అన్నాడు రాములు.

"అవును రామూ! మీ మగాళ్ళంతా ఎందుకలా తాగుతారు? దానిలో ఏముంటుంది? అది చాలా చేదుగా ఉంటుందని అంటావే..." అంది రంగి.

"రంగీ, అప్పుడప్పుడు మనస్సు అదోలా ఉంటుందే. అప్పుడు మందు కావాలి. ఒక్కోసారి బాగా అలిసిపోతాను. ఏమీ చేయాలనిపించదు. అప్పుడు చుక్కపడితే అంతా బాగై పోతుంది."

రంగి కాసేపు ఏమీ మాట్లాడలేదు. అలాగే ఉండిపోయింది. ఆ విషయం గురించి ఆమె పొడిగించదలచుకోలేదు. "అవును రామూ! నాకు ఇంకెవరితోనన్నా పెళ్ళయి ఉంటే ఏం చేసేవాడివి?"

"మీ అమ్మ నూరే ఖారాలు మిరియాలు భరించి ఎవరే నిన్ను పెళ్ళాడేది? అయినా నువ్వెక్కడ వున్నా నే వెళ్ళి లేవదీసుకు రానూ!"

"ఇప్పుడు నిలవనిస్తే చాలు... అంత ప్రేమ ఒలక బొయ్యకు. ఈ ప్రపంచంలో ఏదైనా జరగచ్చు" అంది రంగి.

ఉన్నట్టుండి విందులో కలకలం రేగింది. కుక్క ఒకటి లోపలకు దూరింది. అది ఎవరి విస్తరిలోనో కలబడింది. దాన్ని బయటకు వెళ్ళగొడుతున్నారు. సేఠ్‌కు కోపం వచ్చింది. ఆయన కోపం అంతా రాములు మీదకు తిరిగింది.

"బీడీ తాగుతూ దర్జాగా కూర్చున్నావా! కుక్కను తరమలేవూ? ఫో... ఇక్కడినుంచి." ఆయన మీదపడి కొట్టలేదు. అంతే...

రాములుకీ రంగికీ చాలా బాధేసింది. వాళ్ళ సంబరంలో నీళ్ళు జల్లినట్లయింది. ఇద్దరూ మాట్లాడకుండా లేచి వెళ్ళిపోయారు. ఎక్కడికి పోతున్నారో వాళ్ళకే తెలియదు.

రాములు చాలా బాధపడుతున్నాడు. రంగి అతన్ని సముదాయించసాగింది. రాములు తన మనస్సును బాధపెడుతున్న అసలు విషయాన్ని బయట పెట్టాడు. "ఆయన అన్నేసి మాటలు అన్నాడు. అదీ నీముందర. అదే నాకు నచ్చలేదు" అన్నాడు.

రంగి ఆలోచనలో పడింది. ఆమె రాములు ఇందాకా అన్న మాటల గురించి ఆలోచిస్తోంది. రాములుకు పెద్ద అవమానమే జరిగింది. ఆ విషయం రంగినీ బాధ పెడుతునే ఉంది. రాములు మాట్లాడకుండా దిగులుగా నడవసాగాడు. అతన్ని అలా చూసి రంగి మనస్సు కరిగిపోయింది.

దారిలో కల్లు దుకాణం కనపడింది. రంగికి గుర్తు వచ్చింది. రాములు మనస్సు పాడైనపుడు చుక్క వేసుకుంటే బాగవుతుంది. రంగి తన కొంగు ముడి విప్పి అర్ధరూపాయి తీసింది.

రాములుకు దాన్ని యిచ్చింది ప్రేమగా. "ఎంతసేపలా ఉంటావు? అక్కడికి పోయి తాగేసిరా... త్వరగా వచ్చెయ్యి. నేను ఇక్కడే కాచుకుని ఉంటా." రాములు హుషారుగా లోపలికి పోయాడు.

రంగి రాములుకోసం ఎదురు చూస్తోంది. ఆమె ఆలోచనలో

పడింది. రాములుని తాగవద్దని తనే ఒట్టు వేయించుకుంది. మళ్ళీ తనే తాగమని డబ్బులు ఇచ్చింది. తను అలా చేసి ఉండకూడదు. ఇంతలో రాములు వచ్చాడు. అతను ఇప్పుడు సంతోషంగా కనపడుతున్నాడు. "చూశావా రంగీ! నాకిప్పుడు బాగుంది. చుక్కేసుకున్నాక నా బాధంతా పోయింది. నేను చెప్పలే!" అన్నాడు రాములు.

"ఇక ఆ సంగతి వదిలెయ్. కానీ, ఇదిగో ఇప్పుడే చెబుతున్నా. నువ్వు గనుక ఎక్కువ తాగావంటే ఇంట్లోంచి గెంటేస్తా. ఆ..." అంది రంగి.

"లేదే రంగీ... ఇంకెప్పుడూ తాగను. నువ్వంటే నాకెంతో ఇష్టం. సేఠ్‌గారి విందు లేకపోతే పోయింది. కాని కడుపు నిండా చుక్క పడింది. కానీ ఇకమీద నేను గోల చెయ్యనే. ఎంత తాగినా సరే. నిన్ను కొట్టను. నువ్వంటే నాకెంతో ఇష్టం."

రాములు వాగడం మొదలు పెట్టాడు. రంగి మాట్లాడకుండా అతన్ని ఇంటికి తీసుకుని వెళ్ళింది.

(2)

అది సాయంసమయం. రంగి చీపురు పుచ్చుకుని ఊడుస్తోంది. ఆమె ఇప్పుడు హైదరాబాద్‌లో ఉండటం లేదు. రాములు కూడా ఆమెతో ఉండటం లేదు. రాములుని ఆమె నాలుగు నెలల కిందట వదిలేసింది. రాములు చెడు సావాసాలు మరిగాడు. రంగి అన్నీ సహించి ఊరుకుంటుందని అనుకున్నాడు. ఆ నమ్మకంతోటే తాగుడు కొనసాగించాడు. అతని మనస్సులో మరో ఆలోచన కూడా ఉంది. ఆమె పెట్టిన షరతు ప్రకారం నడుచుకుంటే తను చులకన

అయిపోడూ... రంగి రాముల్ని చాలా సార్లు బెదిరించింది. తిట్టింది. వదిలేసి పోతానని భయపెట్టింది. కానీ ఆమె బెదిరింపులను రాములు ఖాతరు చెయ్యలేదు.

ఒకరోజు రాములు పీకలదాకా తాగివచ్చాడు. "ఎవర్నే... వదిలిపెట్టి పోతావు?" అన్నాడు. తన సత్తా చూపించాలని రంగిని కొట్టాడు. ఆ మరునాడు రంగి వెళ్ళిపోయింది. ఆమె తన తల్లి ఇంటికి వరంగల్ వచ్చింది. అక్కడ పురుషోత్తం అనే అధికారి దగ్గర పని చేయడానికి కుదిరింది. ఎప్పటిలాగే ఊడ్చేపని చేయసాగింది.

వరంగల్‌లో రంగికి జరుగుబాటు బాగానే ఉంది. కానీ ఆమెను రాముల్ని వదిలేసి వచ్చానే అన్న చింత బాధించసాగింది. హైదరాబాద్ నుండి వచ్చిన వాళ్ళందరినీ రాములు గురించి అడగడం మొదలు పెట్టింది. తను కావాలనుకుంటే మళ్ళీ రాములు దగ్గరకు వెళ్ళి పోవచ్చు. అది ఆమెకు తెలుసు. రాములు ఆమెను ప్రేమతో ఆదరిస్తాడని. కానీ రంగి కొంతకాలం ఆగదలిచింది. రాములు వచ్చి పిలిచేదాకా వెళ్ళకూడదు. అనుకుంది. రాములు తనను వచ్చి పిలుచుకుని వెళ్ళాలని ఆమె ఎన్నో మొక్కులు మొక్కింది. అయినా రాములు నుండి పిలుపు రాలేదు. రంగికి ఇది చాలా నిరాశ కలిగించింది. ఆబాధ వల్ల ఆమె చిటపటలాడసాగింది. ఆ కోపమంతా పురుషోత్తం మీద మళ్ళింది. ఆమె పురుషోత్తం మీద చిర్రుబుర్రులాడసాగింది. అతని మీద రంగి కొన్ని పాటలు కట్టింది.

ఒకరోజు రంగీ, మంగీ కలిసి ఊడుస్తున్నారు. కలిసి పాటలు పాడుతున్నారు. అంతలో పురుషోత్తం అటుగా వచ్చాడు. అతని చేతిలో చిన్న కర్ర ఉంది. దానితో కాళ్ళమీద కొట్టుకుంటూ నడుస్తున్నాడు. అతను ఈపాటవిన్నాడు. ఆపాట తనమీదే అని అతనికి

అర్థం అయింది. "ఏయ్! పని చెయ్యండి! పని... ఉత్త పనికి మాలిన వాళ్ళలా ఎందుకలా గొంతు చించుకుంటారు?" అని అరవడం మొదలు పెట్టాడు.

మంగి సిగ్గు పడింది. కానీ రంగి జవాబు ఇచ్చింది. "అవును... పాడుతున్నాం. కానీ మా చేతులు పని చేస్తునే ఉన్నాయి. కనపడటం లేదా?" అంది.

"విశ్వాసహీనురాలా! నాకే ఎదురు చెప్తావా? నీపై ఆఫీసర్‌నే అవమానిస్తావా? ఎదురు జవాబు చెబుతావా?" అంటూ పురుషోత్తం మండి పడ్డాడు.

"కానీ... అయ్యా!"

"చాల్లే. నాకింకా చాలా పనుంది. దీని మీద వేలిముద్ర వెయ్యి. జీతం ఇస్తాను" అన్నాడు. అతని దగ్గరలో అరుగుమీద కాగితాలు ఉన్నాయి. ముందర మంగి ముద్ర వేసింది. తరువాత అతను రంగిని వేలిముద్ర వెయ్య మన్నాడు.

"ముందర డబ్బులియ్యి, ఆ తరువాతే వేలిముద్ర" అంది రంగి.

"ఏమిటీ? మీరేమో దొరలు... సర్కారు వాళ్ళేమో దొంగలూనా? ఇక్కడంతా సర్కారు వాళ్ళ రూల్సు ప్రకారమే జరుగుతుంది. ముందర వేలిముద్ర వెయ్యి. తరువాతే జీతం" అన్నాడు.

"అయితే, పట్టు, వేస్తా వేలిముద్ర" అంటూ రంగి పురుషోత్తం వైపు వేలు చూపింది. తరువాత కాగితం మీద వేలిముద్ర వేసింది. పురుషోత్తం రంగీ, మంగీల జీతంలో అర్థ రూపాయి కోసేశాడు. మిగిలిన డబ్బుని నేల మీదకు విసిరేశాడు. మంగి తన డబ్బుల్ని తీసేసుకుంది. "నా డబ్బుల్ని నాకు పూర్తిగా ఇచ్చెయ్యి. అట్లా అయితేనే తీసుకుంటా. లేకపోతే తీసుకోను" అంది రంగి.

"తీసుకోకపోతే అలాగే పడి ఉండనీ. నే పోతున్నా." అంటూ పురుషోత్తం బయలుదేరాడు. రంగి తన పొడవాటి చీపురును దగ్గరలోని గోడమీద పెట్టింది. పురుషోత్తంను పోనీయకుండా అడ్డుగా నిలబడింది.

రంగి దగ్గర తన ఆటలు సాగవని గ్రహించాడు పురుషోత్తం. అందరి ముందూ తను చులకన అయిపోతాడు " తీసుకు ఫో...నీ డబ్బులు. ఆ అర్ధం రూపాయి ఇటు ఇచ్చెయ్" అన్నాడు.

"ముందు రూపాయి ఇయ్యి. అప్పుడు అర్ధం రూపాయి ఇస్తా" అంది రంగి.

పురుషోత్తం రూపాయిని నేల మీదకు విసిరేశాడు. రంగి చీపురుని చేత్తో తీసుకుంది. వంగి రూపాయి తీసుకుంది. వేరేవైపు చూపు మళ్ళించింది. రూపాయిలు చేతిలో గలగల లాడాయి. ఇంతలో "రంగీ... అరెఒ... రంగీ..." అంటూ ఎవరిదో పిలుపు వినబడింది.

రంగి అటు తిరిగి చూసింది. రంగి అత్త ఆమెను పిలుచుకు పోవడానికి వచ్చింది.

(3)

మొదటి మూడురోజులు రంగి రాములు ఎంతో సంతోషంగా గడిపారు. నాలుగోరోజు రంగితో అన్నాడు రాములు. "రంగీ... నీ గుండె నిజంగా బండరాయేనే! నువ్వెళ్ళి పోయాక నాకైతే అసలు తోచనేలేదు. నువ్వక్కడ హాయిగా ఉన్నావు."

"అక్కడ నాకూ ఏమీ బాగలేదు. కానీ నువ్వు పిలవకుండా నేనెలా వస్తాను?" అంది రంగి.

"నేను నిన్ను ఏముఖం పెట్టుకు పిలవను? తప్పునాది. ఎన్నాళ్ళు ఉంటుంది. అదే రెండు రోజుల్లో తిరిగి వస్తుంది అనేది అమ్మ.

కానీ, నువ్వు మాట పట్టింపుకు పోయి కూచున్నావు."

"తప్పు చేసింది నువ్వు. నువ్వే పిలవాల్సింది."

"నువ్వు రావాలని నేనెన్ని మొక్కులు మొక్కానో తెలుసా? అమ్మ 'వేరే పెళ్ళి చేసుకో' అంటుంది. కానీ, నేనెమో 'నేను ఎవర్నీ చేసుకోను. నాకు నా రంగే కావాలి' అన్నాను. అప్పుడిక మా అమ్మ నీకోసం బయలుదేరి వచ్చింది," అన్నాడు రాములు.

"నేనూ చాలా మొక్కులు మొక్కా. మీ అమ్మ పిలవడానికి వచ్చేదాకా" అంది రంగి.

రాములు ఉలిక్కి పడ్డాడు. "అరే రంగీ! నువ్వెంత పని చేశావే... నా మొక్కులకు యాభై రూపాయలు అయినాయి. నీ మొక్కులకు అరవై రూపాయలు అయినాయి. పెళ్ళికి చేసిన అప్పు ఇంకా రెండు వందల యాభైదాకా ఉంది. ఇదంతా ఎక్కడనుండి తేవాలి?"

రంగికి భయం వేసింది. అయినా రాములికి ధైర్యం చెప్పింది.

రాములు, రంగి ఇద్దరూ బెంగతోనే నిద్రపోయారు. మూడు రోజులూ వారు అనుభవించిన సుఖం అంతా ఆవిరై పోయింది. మళ్ళీ వాళ్ళిద్దరూ కష్టాల కాపురంలో మునిగిపోయారు.

మరునాడు రంగి తన నగలు బయటకు తీసింది. అమ్మెయ్యడానికి. రాములు వాటిని తాకట్టు పెట్టాడు. అలా తాకట్టు పెట్టగా వచ్చిన డబ్బు కొంచెమే. ఆ తరువాత వచ్చిన దంతా వడ్డీలకు కట్టడానికే సరిపోయింది. రాములు రంగి ఆ సంగతి గ్రహించలేకపోయారు. అప్పుడే రాములు తల్లి చనిపోయింది. రంగికి పిల్లాడు పుట్టాడు. ఖర్చులు పెరిగిపోయాయి. రంగి సంపాదన ఆగిపోయింది. బాధలు మరచిపోవాలని రాములు మరింతగా తాగడం మొదలుపెట్టాడు.

రంగి రాములును బెదిరించింది. ఆ బెదిరింపులో కోపం లేదు.

ధైన్యం ఉంది. రాములు పరిస్థితికి తానే కారణమని ఆమె అనుకుంది. ఒకరోజు రాములు ఇంటికి రాలేదు. రంగి అతన్ని ఫుట్‌పాత్ మీద నుండి వెతికి పట్టుకొచ్చింది. రంగి మనస్సులో పిరికితనం ఏర్పడింది. ఆమెకు ఇప్పుడు సలహాలు ఇచ్చే శక్తి లేదు.

ఒకరోజు రాత్రి ఉరుములు మెరుపులతో గాలివాన మొదలైంది. రాములు ఇంటికి రాలేదు. రంగి రాముల్ని వెతకడానికి బయలుదేరింది. రెండు గంటలు వెతికాక రాములు దొరికాడు. అతను నది ఒడ్డున ఇసుకమీద పడి ఉన్నాడు. రంగి అతన్ని లేపి నెమ్మదిగా ఇంటికి తీసుకు వచ్చింది. రాములుకి జ్వరం వచ్చింది. రంగి మళ్ళీ మొక్కుకుంది. వైద్యుడిని తీసుకు వచ్చింది. కానీ రాములు మళ్ళీ లేవనేలేదు. రంగి విధవ అయిపోయింది.

(4)

ఒకరోజు రంగి వీధి ఊడుస్తోంది. ఆ దగ్గరే ఉన్న అరుగుపైకి ఒకాయన వచ్చాడు. అరుగును శుభ్రం చేశాడు. చాప పరచాడు. అతని దగ్గర ఏవో చిత్రపటాలూ, బొమ్మలూ పాచికలూ ఉన్నాయి. "సామీ! నేనో ప్రశ్న అడుగుతా. చెబుతారా?" అని అడిగింది రంగి.

"నాలుగణాలు అక్కడ పెట్టి అడుగు, చెబుతా" అన్నాడు ఆయన.

రంగి నాలుగు అణాలు తీసి అక్కడ పెట్టింది. "సామీ! ఎవరైనా మనిషి మొక్కిన మొక్కులు తీర్చకుండా చనిపోయాడనుకోండి. అప్పుడు అతని పెళ్ళాం ఆమొక్కుబడులు తీర్చిందనుకోండి. ఆ ఫలితం ఆ పోయిన మనిషికి దక్కుతుందా? సరిగ్గా చూసి చెప్పండి" అంది.

ఆయన వేళ్ళు మడిచి లెక్కలు గట్టాడు. "ఆ... దక్కుతుంది. అనుమానం లేదు" అన్నాడు.

"మంచిది సామీ," అంటూ రంగి లేచి వెళ్ళబోయింది. స్వామీజీ ఆమెను వెనక్కి పిలిచాడు. "అయితే ఒక్కటి మాత్రం మర్చిపోకు. ఆమె మళ్ళీ పెళ్ళి చేసుకుంటే ఆ ఫలితం అతనికి దక్కదు" అన్నాడు. రంగి ఆయనకు నమస్కారం చేసి వెళ్ళిపోయింది.

రంగి మొక్కుబడులు తీర్చడానికి డబ్బులు కూడబెట్టడం మొదలు పెట్టింది. ఆమెను పెళ్ళాడతామంటూ చాలా మంది వచ్చారు. రంగి అందరికీ ఒకే జవాబు చెప్పింది. "రాములు మొక్కిన మొక్కులు తీర్చేవరకూ నేను పెళ్ళి చేసుకోను" అని.

రాములు మొక్కిన మొక్కులు తీర్చడమైతే అయిపోయింది. కానీ అందుకు ఏడేళ్ళు పట్టింది. అప్పుడూ ఆమెను పెళ్ళాడతానని ఒకతను వచ్చాడు.

"వద్దు! వద్దు! ఇప్పుడిక ఈ వయస్సులో నాకా బాదరబందీ వద్దు" అని జవాబు చెప్పింది రంగి.

---

Lasertypeset at Printofast, 11/4 Old Rajinder Nagar, New Delhi - 110060
and printed at Tara Art Printers, Sector-V, NOIDA

